

## వైదిక సంస్కృతిలో

# వానప్రస్థాశ్రమం

**50 సంవత్సరాల పైబడిన వారందరు**
**తప్పక చదువతగిన అతి ముఖ్య గ్రంథం**


కర్త :

సుమ్నార్థి

**డా॥ కోడూరి సుబ్బారావు**



ప్రకాశకులు :

**గాయత్రీ ఆశ్రమ ట్రస్టు,**

ఆర్యసమాజము - వ్యాస్‌నగర్, మేడిబావి, వారాసిగూడ,

సికింద్రాబాద్ - 500 061.

సెల్ : 9290604641.

శ్రీ ప్లవనామ సం॥ర శ్రీరామ నవమి (21-4-2021)

ప్రతులు : 1000 **మూల్యము : 15-00**

# ప్రకాశకీయం

పరమేశ్వరుడు అద్భుతాద్భుతమైన మానవ శరీరాన్ని నిర్మించి దానికి నూరు సంవత్సరాల సామాన్య ఆయుర్దాయాన్ని నిర్ణయించాడు. ఈశ్వరీయ జ్ఞానమైన వేదాలను తరచి చూచిన మన ప్రాచీన ఋషులు ఆ జీవనకాలాన్ని నాలుగు భాగాలుగా చేసి వాటికి ఆశ్రమాలని పేరుపెట్టారు. మానవ జీవితంలోని మూడవ భాగానికి 'వానప్రస్థాశ్రమ' మని పేరు. ఆ జీవనకాలంలో ముఖ్యంగా ఆత్మికోన్నతికి కృషిచెయ్యాలి. ఆత్మ పరమాత్మలను గురించి స్వాధ్యాయ మనన చింతన ధ్యానాదులను ఆచరించాలి. సృష్ట్యాదినుండి మహాభారతకాలం వరకు వానప్రస్థాశ్రమప్రథ బాగానే కొనసాగినది. అనంతరం మన దేశం విదేశీయుల పాలనలో, విమతస్థుల పాలనలో పెక్కు యిక్కట్లకు గురిఅయ్యింది. దానితో ఈ ప్రథ మరుగున పడిపోయింది. మహర్షి దయానందులవారు మరల దానిని పునరుద్ధరించి మనకెంతో మేలుచేశారు.

వానప్రస్థాశ్రమాన్ని నేటికాలానికి అనువుగా ఎలా మార్చుకోవాలో డా. కోడూరి సుబ్బారావుగారు ఈ లఘుగ్రంథంలో సంక్షిప్తంగా తెలిపారు. దానిని మా గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురిస్తున్నది. దీనిని చదివి ఏ కొద్దిమంది ప్రేరితులై ఆధ్యాత్మిక జీవనాన్ని గడిపినా రచయిత కృషి, మా కృషి సఫలమైనట్లు భావింతుము. చదివినవారు మీమీ అభిప్రాయాలు తెలుపగోరుచున్నాము.

అనేక కారణాల వల్ల ఈ మధ్య పెద్దవయస్సులో కొన్ని ఆరోగ్య ఇబ్బందులు ఏర్పడు తున్నాయి. పిల్లలు చాలా దూరంగా - కొందరు విదేశాలలో కూడా గడపవలసి వస్తున్నది. అట్టివారు తగిన ఓల్డేజ్ హోమ్స్‌కు వెళ్ళటమే మంచిది. ఆరోగ్యం బాగున్నవారు ఆధునిక వానప్రస్థాశ్రమాలకు వెడుతున్నారు. తగినంత డబ్బు ఉన్నవారు రిటైర్‌మెంట్ హోమ్స్ కొనుక్కుని వారికి అభిరుచిగల వ్యాసంగంలో గడుపుతున్నారు. ఎవరెక్కడున్నా ఆత్మజ్ఞానాన్ని వివేకాన్ని పెంచే గ్రంథాలను స్వాధ్యాయం చేస్తూ మానవ చింతన ధ్యానాలను చేసుకోవడం ఉత్తమం. అందుకు మహర్షి దయానందులవారు వ్రాసిన సత్యార్థప్రకాశం, ఋగ్వేదాదిభాష్యభూమిక, వేద భాష్యాలు చాలా చాలా ఉపకరిస్తాయి. వీటితోబాటు వైదిక వినతి (1, 2 భాగాలు), విశుద్ధ భగవద్గీత, ఉపనిషత్తులు మొ॥ చదువుకోవచ్చు.

ఈ గ్రంథాన్ని చక్కగా కంపోజ్ చేసిన శ్రీ చకిలం వినోద్ కుమార్ గారికి, అందంగా ముద్రించి యిచ్చిన ప్రింట్‌షాప్ వారికి ప్రేమపూర్వక ధన్యవాదములు.

మీ సేవలో
గాయత్రీ ఆశ్రమ ట్రస్టు



# వైదిక సంస్కృతిలో వానప్రస్థాశ్రమం

పరమేశ్వరీయ జ్ఞానమైన వేదాలను చక్కగా అధ్యయనం చేసిన మన ప్రాచీన ఋషులు మానవ జీవన కాలాన్ని నాలుగు భాగాలుగా విభజించి, వాటికి ఆశ్రమాలని పేరు పెట్టారు. ఆ యా ఆశ్రమాలలో చేయవలసిన విధులను, చేయకూడని నిషేధాలను సూచించారు. అవే – 'బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థ సంన్యాస' ఆశ్రమాలు.

మానవ శరీర సామాన్య ఆయుర్దాయం 100 సంవత్సరాలు. ప్రాకృతిక నియమాలను, ఆరోగ్య నియమాలను పాటిస్తూ యుక్తాహార విహార వ్యాయామ ప్రాణాయామాదుల నాచరిస్తే 100 సంవత్సరాలకన్నా ఎక్కువకూడ జీవించవచ్చు. దుర్వ్యసనాలకు తీవ్ర వ్యాధులకు గురిఅయితే అల్పాయువులోనే మరణించవచ్చు. కనుక, పురుషార్థపరులై అరుదుగా లభించే మానవ శరీర ఆయువును – మానవ జీవనకాలాన్ని పెంచుకోమని వేదం సూచిస్తుంది. 'భూయశ్చ శరదః శతాత్' (యజుర్వేదం. 36-24) నూరు సంవత్సరాలకన్న ఎక్కువకాలం నేను ఆరోగ్యంగా ఆనందంగా యింద్రియపటుత్వంతోకూడిన జీవితాన్ని అనుభవింతును గాక' యని ఉదయ సాయం సంధ్యాసమయాలలో దృఢసంకల్పం చెయ్యమంటుంది. ఆయుర్వేదాది గ్రంథాలు దీనిని విశ్లేషిస్తూ వివరిస్తూ ఎన్నెన్నో సూచనలు చేస్తాయి. దీర్ఘ జీవన ఉపాయాలు అక్కడ చూడండి.

'ఆశ్రమం' అంటే – 'ఆ = సమంతాత్ + శ్రమయతి యస్మిన్" – దేనిలో ఒక పద్ధతి ప్రకారం, ఒక లక్ష్యం కొరకు శ్రమిస్తామో అట్టిదానిని 'ఆశ్రమం' అంటారు. బ్రహ్మచర్యాశ్రమంలో విద్యకొరకు, బలమైన శరీరంకొరకు, సదాచారం నేర్చుకోవటం కొరకు శ్రమిస్తారు. గృహస్థాశ్రమంలో మిగిలిన మూడు ఆశ్రమాలవారిని పోషించటానికీ, సంతానాన్ని కని పెంచి పెద్దచేసి వారి జీవికకు ఒకమార్గాన్ని చూపించటానికి శ్రమిస్తారు. అట్లే, వానప్రస్థులు రాగద్వేషాదులనుండి, సంసారమోహం నుండి విడివడటానికి శ్రమిస్తారు. యోగసాధనచేస్తూ ఆత్మ పరమాత్మల సాక్షాత్కారాన్ని పొందటానికి శ్రమిస్తారు. సంన్యాసాశ్రమంలో తాము పొందిన జ్ఞానాన్ని లోకంలో

వెదజల్లటానికీ, అధర్మాన్ని అవైదికాచారాలను నివారించటానికి దేశాటనం చేస్తూ శ్రమిస్తారు. అందరూ శ్రమించాలి కనుకనే వీటికి ఆశ్రమాలని పేరు పెట్టారు. వీటిలో బ్రహ్మచర్య గృహస్థాశ్రమాలు రెండూ ప్రవృత్తి మార్గాలు. వానప్రస్థ సంన్యాసాశ్రమాలు రెండూ నివృత్తి మార్గాలు. వేద మేమంటుందంటే

**'కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేత్ శతం సమాః ।'**యజుర్వేదం (40-2)

అంటుంది వేదవిహిత కర్మలు చేస్తూనే నూరు సంవత్సరాలు జీవించగోరుమని పై వేదవాక్య భావం. ఇక్కడ కర్మలు అంటే ఆ యా కాలాలలో ఆ యా ఆశ్రమాలలో చేయవలసిన కర్మలని అర్థం. ఇంతేగాక, యజ్ఞ దాన తపస్సులను ఆచరిస్తూ ఇహలోక ఉన్నతిని, పరలోక ఉన్నతిని పొంద యత్నించటం. ముఖ్యంగా మనం ఈ చిన్న పుస్తకంలో వానప్రస్థాశ్రమాన్ని గురించి తెలుసుకుందాము.

## వానప్రస్థాశ్రమం

'వానప్రస్థాశ్రమం' అంటే వనాలకు ప్రస్థానమై (వెళ్ళి) అచట తాపసిక జీవనాన్ని గడపటం. ఇది జీవితంలోని మూడవ భాగం. ఇందుకు శతపథ బ్రాహ్మణ మేమంటుందంటే –

**"బ్రహ్మచర్యాశ్రమం సమాప్య గృహీ భవేత్ । గృహీ భూత్వా వనీ భవేత్ ।**
**వనీ భూత్వా ప్రవ్రజేత్ ॥** (14వ కాండం – జాబాలోపనిషత్తు)

అంటుంది. దీని భావమేమంటే – బాలబాలికలు ముందుగా గురుకులాలకు వెళ్ళి చక్కగా బ్రహ్మచర్యాశ్రమ విధిని పూర్తిచేసి మంచి విద్యావంతులు, సదాచారవంతులు, బలవంతులు కావాలి. అనంతరం స్నాతకులై తమ గుణకర్మ స్వభావాల కనుగుణమైన వారిని వివాహమాడి గృహస్థాశ్రమ బాధ్యతలను నెరవేర్చాలి. తదుపరి వనాలకు వెళ్ళి తాపసిక జీవనాన్ని గడుపుతూ యోగాభ్యాసం చెయ్యాలి. ధారణా ధ్యాన సమాధుల నభ్యసించాలి. ఆత్మ పరమాత్మల సాక్షాత్కారం పొందాలి. అటుపిమ్మట–పూర్తి వైరాగ్యం కలిగి సంన్యాసాశ్రమ నియమాలు చక్కగా పాటించగలననే నమ్మకం కలిగిన తదుపరి సంన్యాసాశ్రమం స్వీకరించి పరివ్రాజకులు (దేశసంచారకులు) కావాలి. తగిన వైరాగ్యం, సామర్థ్యం లేకుంటే వానప్రస్థులుగానే ఉండిపోవాలి.

సామాన్యంగా 50 సంవత్సరాల తరువాత మన శరీరాలు క్రమంగా బలహీనపడతాయి. 60 సంవత్సరాలు వచ్చేసరికి ఉద్యోగం భారమనిపిస్తుంది.

కనుకనే ఉద్యోగ విరమణ చెయ్యాలంటారు. వ్యాపారాలు కూడా విరమించటం మంచిది. అప్పటికి పిల్లలు పెద్దవారవుతారు. పెండ్లిండ్లు జరగటం, వారికి పిల్లలు పుట్టడం కూడా జరుగుతుంది. కనుక, ఆ సమయంలో యింట్లో ఉండి మోహరాగాలలో చిక్కుపడేకన్న వానప్రస్థులై ఆత్మోన్నతికి యత్నించటం మంచిది. అందుకనే 'పౌత్ర ముఖం దృష్ట్వా వనీ భవేత్' అన్నారు పెద్దలు. 'అపత్య స్యైవ చాపత్యం తదారణ్యాం సమాశ్రయేత్ - కుమారునికి కుమారుడు కలుగగానే వానప్రస్థివి కమ్మంటుంది మనుస్మృతి (6-2).

ఇప్పుడు వనాలు నివాస యోగ్యాలుగా లేవు. కొన్నిచోట్ల అనుకూలంగా ఉన్నా కొన్ని భయాలున్నాయి. ఇంతేగాక, 60 సంవత్సరాల పైబడిన తరువాత మన శరీరాలకు కొన్ని ఆరోగ్యసమస్య లొస్తున్నాయి. వైద్యుల అందుబాటు అవసర మౌతున్నది. కనుక, పట్టణాలకు దూరంగా ప్రశాంత వాతావరణంలో కొందరుకలిసి వానప్రస్థాశ్రమాలు నిర్మించుకొని శేషజీవితం అక్కడ గడపటం మంచిది. అప్పటికి యింకా పెండ్లిండ్లు కావలసిన కుమారులు, కుమార్తెలు ఉంటే వారికి కూడా వివాహాలు చేసి బయలుదేరటం మంచిది. నేడు ప్రచలితమైయున్న షష్ఠిపూర్తి ఉత్సవం చేసుకొని బయలుదేరవచ్చు. భార్య అంగీకరిస్తే ఆమెను తమ వెంటతీసుకువెళ్ళాలి. లేకుంటే ఆమె బాధ్యతను కుమారుల కప్పగించాలి.

కొడుకులు పెద్దవారైన తరువాత పెద్దలు గృహబాధ్యతలు కొడుకుల కప్పగించటమే మంచిది. లేకుంటే గృహకలహాలకు కారణమౌతాయి. తండ్రీ కొడుకుల మధ్య, అత్తా కోడళ్ళ మధ్య వివాదాలేర్పడతాయి. దూరంగా ఉంటేనే ప్రేమాసక్తులు, శ్రద్ధాభక్తులు బలపడతాయి. ఇది గుర్తించే మన ప్రాచీన ఋషులు వానప్రస్థాశ్రమాన్ని ఏర్పాటు చేశారు. ఇంతేగాక, మానవులమై పుట్టిన తరువాత తెలుసుకోవలసిన ఆధ్యాత్మిక విషయాలెన్నో ఉన్నాయి. వాటిని తెలుసుకోవటానికీ, సాధనచేసి వాటి ఫలితాలను పొందటానికి వానప్రస్థాశ్రమం ఎంతో అవసరం.

## మానవ జన్మ - త్రివిధ దుఃఖాలు

'మానవ జన్మ బహుమూల్యమైన' దని పెద్దలంటారు. ఈ జన్మలో యింద్రియాలన్నీ వికసించి ఉండటంతోబాటు బుద్ధి వికసించి ఉంటుంది. దానితో మానవుడు ఎన్నెన్నో సుఖసాధనాలను సమకూర్చుకొని మిగిలిన ప్రాణులకన్న ఉత్తమంగా ఉన్నతంగా జీవిస్తున్నాడు. ఈ ప్రగతి కంతటికి కారణం జ్ఞానగ్రహణ సామర్థ్యంగల అతని బుద్ధియే. దానితోనే అతడు విద్యావంతుడు విజ్ఞానవంతుడు అవుతున్నాడు. అట్టి

విశిష్టమైన బుద్ధితో అతడు కేవలం ఈ ప్రాపంచిక పదార్థాల జ్ఞానాన్ని పొందటమే కాక ఆత్మ పరమాత్మల జ్ఞానాన్నికూడా పొందాలనీ, సాధనచేసి - యోగాభ్యాసం చేసి ఆత్మ పరమాత్మలను సాక్షాత్కారం చేసుకోవాలనీ, పరమశాంతిని పరమానందాన్ని పొందాలనీ మన ఋషులంటారు. అప్పుడే జీవితం సార్థకమౌతుంది. అందుకు వానప్రస్థాశ్రమం మిక్కిలి అనుకూలంగా ఉంటుంది.

ఆధ్యాత్మికవిద్య అంటే కొందరు విముఖత చూపుతారు. దానివల్ల ప్రయోజన మేమిటంటారు. అంతకన్న పురుషార్థంచేసి మరిన్ని ప్రాపంచిక సుఖాల ననుభవించవచ్చును కదా ! అంటారు. కనబడని దేవునిగూర్చి ఆలోచిస్తూ సమయం నష్టపరచుకోవటం కన్నా ఎదురుగా తేలికగా లభిస్తున్న సుఖాలకోసం ప్రయత్నమెందుకు చేయకూడదంటారు. కానీ, మానవ జీవనగమనాన్ని సూక్ష్మంగా పరిశీలించినట్లయితే అతని ప్రయత్నమంతా 'దుఃఖనివృత్తి - సుఖప్రాప్తి' నని తెలుస్తుంది. మనొకొచ్చే దుఃఖపరంపరలు అనంతం. ఒక దుఃఖం శాంతించి కొంత ఊరట కలుగుతున్నదంటే మరొక కష్టం ఎదురౌతుంది. కొందరికి దుఃఖాలు తొందరలోనే ఉపశమిస్తే మరికొందరిని ఆ దుఃఖాలు నెలలు సంవత్సరాలు పట్టి పీడిస్తాయి. అప్పుడే ఈ కష్టపరంపరలకు కారణ మేమిటనే ఆలోచన మొదలౌతుంది. కష్టాలలోనే ఆధ్యాత్మికవిద్య చక్కగా అర్థమౌతుందంటారు పెద్దలు. ఇది సామాన్యుల సంగతి. మహాత్మా బుద్ధునివంటి వివేకవంతులు ఇతరుల కష్టాలను చూసినా ఆలోచన ప్రారంభిస్తారు. కారణాన్వేషకులౌతారు.

మన ప్రాచీన ఋషులు ఈ విషయంపై లోతుగానే అధ్యయనం చేశారు. వారు ముందుగా దుఃఖాలను మూడు వర్గాలుగా విభజించి వాటికి ఆధ్యాత్మిక, అధిభౌతిక, ఆధిదైవిక దుఃఖాలని పేర్లు పెట్టారు. శరీరానికొచ్చే వివిధ బాధలను రోగాలను, మనస్సుద్వారా కలిగే అవమాన అసూయ రాగద్వేష భయాందోళనాది వికారాలను కలిపి ఆధ్యాత్మిక దుఃఖాలన్నారు. ఇతర ప్రాణుల ద్వారా కలిగే బాధలను కష్టాలను ఆధిభౌతిక దుఃఖాలన్నారు. శత్రువులనుండి, దుష్టులనుండి, క్రూరమృగాలనుండి, క్రిమికీటక సర్పాదులనుండి కలిగే దుఃఖాలన్నీ ఈ వర్గంలోని కొస్తాయి. మిగిలిన అతివృష్టి అనావృష్టి భూకంపాలు ఉప్పెనలు మొదలగు వాటిని ఆధిదైవిక దుఃఖాలన్నారు. వీటన్నిటినుండి పూర్తిగా విముక్తి కలిగిన స్థితినే ముక్తి అన్నారు కపిల మహర్షి -

**'త్రివిధ దుఃఖ అత్యంత నివృత్తిః అత్యంత పురుషార్థః '**

- సాంఖ్య దర్శనము (1-1-1)

ఈ మూడురకాల దుఃఖాలనుండి అత్యంత నివృత్తి కొరకు ప్రయత్నించడమే పరమ పురుషార్థమన్నారు. దానికి వానప్రస్థాశ్రమం అత్యంత అనుకూలం.

బ్రహ్మచర్యాశ్రమంలో తాను బాగా చదువుకొని జీవితంలో స్థిరపడాలనే వత్తిడి (టెన్షన్) ఉంటుంది. గృహస్థాశ్రమంలో చాలా బాధ్యతలుంటాయి. ముఖ్యంగా పిల్లలను పెంచి పెద్దచేసి విద్యావంతులను ఉద్యోగస్థులను చేసే బాధ్యత ఉంటుంది. వివాహాలు జరిపించవలసి ఉంటుంది. ఈ వత్తుదుల వల్ల అతడు ముక్తికొరకు సాధనలు చేయకలేపోతాడు. ఆ బాధ్యతలన్నీ తీరిపోతాయి కనుక వానప్రస్థాశ్రమంలో శరీరానికి, మనసుకు విశ్రాంతి దొరుకుతుంది. అప్పుడు ఆధ్యాత్మికవిద్య చక్కగా అర్థమౌతుంది.

ఆధ్యాత్మికవిద్యలో ముఖ్యంగా తానెవరో, సృష్టిని సృజించి నియమించి నడిపిస్తున్నతత్త్వమేదో, ఈ సృష్టి ఏమిటో ఎందుకో, తనకొరకు ఎవరు ఈ శరీరాన్ని రచించి యిచ్చారో, తన ప్రేమయం లేకుండానే శరీరంలో జరిగే జీర్ణక్రియకు, రస రక్త నాడీ ప్రసరణాది క్రియలు జరగటానికి కారణమెవరో మొదలైనవి తెలుసుకోవాలి. తన యథార్థస్థితిని గుర్తించి తన పయనమెటో నిర్ణయించుకోవాలి. అందుకు తగిన సాధన సామగ్రిని సమకూర్చుకోవాలి. అందుకు వానప్రస్థాశ్రమం మిక్కిలి అనుకూలం. కనుక ఇచట వాటిని సంక్షిప్తంగా తెలుసుకుందాం.

## మనమంతా జీవాత్మలము

'నేను, నేను' అని వ్యవహరించే మనం ఈ శరీరంలో ఉండికూడా శరీరానికన్న వేరుగా ఉన్నాం. ఈ విషయం ప్రశాంతంగా కూర్చుని ఆలోచిస్తేనేగాని అర్థం కాదు. దానికి కపిల మహర్షి సరళమైన ఒక చిన్న ఉపాయం చెప్పారు. అదియేమిటంటే – **'షష్ఠీ వ్యపదేశాదపి'** సాంఖ్యదర్శనం (6-3). వ్యపదేశమంటే వ్యవహారమని అర్థం. లోకంలో మనం 'నా శరీరం, నా కాలు, నా చేయి' అని వ్యవహరిస్తూ ఉంటాం. అట్లే 'నా మనస్సు, నా బుద్ధి' అంటూ ఉంటాం. ఈ వాక్యాలన్నీ షష్ఠీ విభక్తిలో ఉన్నాయి. 'నా శరీరం' అనే పదమును విడమరచి విగ్రహవాక్యంగా చెబితే 'నాయొక్క శరీరం' అవుతుంది. ఈ షష్ఠీ విభక్తి ప్రయోగం సంబంధాన్ని తెలుపుతుంది. ఏ విధంగా 'నా యిల్లు, నా కారు' అన్నపుడు మనం వాటికి వేరుగా ఉన్నట్లు అర్థమౌతుందో అట్లే 'నా శరీరం' అన్నపుడు మనం శరీరం కన్న వేరుగా ఉన్నామని అర్థం చేసుకోవాలి. యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు భగవద్గీతలో జీవాత్మను గురించి చాలానే వివరించి చెప్పాడు. అందులో

రెండు శ్లోకాలు -

శ్లో॥ న జాయతే మ్రియతే వా కదాచిత్

నాయం భూత్వా భవితా వా న భూయః ।

అజో నిత్య శ్శాశ్వతోఽయం పురాణో

న హన్యతే హన్యమానే శరీరే ॥ (భగవద్గీత. 2-20)

ఈ జీవాత్మ ఎప్పుడూ క్రొత్తగా పుట్టలేదు. ఎప్పటికీ ఇది మరణించదు. ఒకప్పుడిదిలేక మరల పుట్టినది కాదు. ఈ జీవుడు జన్మలేనివాడు. నిత్యుడు. ఎల్లప్పుడు ఉండేవాడు. శాశ్వతుడు. పురాణుడు. అనాది. ఈ శరీరం చంపబడినంత మాత్రాన అతడు (జీవుడు) చావడు.

అట్టి శాశ్వతుడు, జ్ఞానవంతుడునైన జీవుడు ఈ శరీరంలో ఇంద్రియ మనో బుద్ధులకన్నా వేరుగా శ్రేష్ఠంగా ఉంటాడు-

**శ్లో॥ ఇంద్రియాణి పరా ణ్యాహుః, ఇంద్రియేభ్యః పరం మనః ।**

**మనస స్తు పరా బుద్ధిర్ యో బుద్ధేః పరత స్తు సః ॥** -భగవద్గీత (3-42)

శరీరంలో యింద్రియాలు వేరుగా శ్రేష్ఠంగా ఉంటాయి. వాటికంటే మనస్సు, మనస్సు కంటే బుద్ధి, బుద్ధికంటే జీవుడు శ్రేష్ఠంగాను సూక్ష్మంగాను ఉంటారు.

ఇంతేగాక, జీవుడు జ్ఞానవంతుడు. మిగిలినవన్నీ ఆ జీవునికి సాధనాలుగా ఉంటాయి. జీవుని ఈ స్థితిని రథంలో కూర్చున్న రాజుగా వర్ణిస్తాయి ఉపనిషత్తులు.

**శ్లో॥ ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవ తు ।**

**బుద్ధింతు సారథిం విద్ధి మనః ప్రగ్రహమేవ చ ॥**

**ఇంద్రియాణి హయా నాహుర్ విషయాం స్తేషు గోచరాన్ ।**

**ఆత్మేంద్రియ మనోయుక్తం భోక్తే త్యాహుర్ మనీషిణః॥** - కఠోపనిషత్తు (3-3,4)

ఓ శిష్యా ! నచికేతా ! ఈ శరీరంలో జీవాత్మ రథస్వామిగా-రాజుగా ఉంటాడు. శరీరాన్ని రథంగాను, బుద్ధిని సారథిగాను, మనస్సును కళ్ళెముగాను, నేత్రాది యింద్రియాలను అశ్వాలుగాను ఆలోచనాపరులగు విద్వాంసులు ఆలంకారికంగా వర్ణిస్తారు. వాటిలో జీవాత్మ ఒక్కడే కర్తా భోక్తా. అతడే దేహేంద్రియ మనోబుద్ధులతో కర్మలుచేస్తూ, వాటి ఫలితాలను అనుభవిస్తూ ఉంటాడు.

అయితే, జీవుడు అవిద్యతో కూడివుండటంవల్ల తన వాస్తవికస్థితిని మరచి దేహాత్మభ్రాంతికి గురియౌతాడు. శరీరమే తాననీ, ఈ శరీరానికి సంబంధించినవారే

తనవారనీ నమ్ముతాడు. తనకొరకు, తన వారికొరకు అహర్నిశలు శ్రమిస్తాడు. అందుకు అప్పుడప్పుడు కొన్ని అధర్మకార్యాలు కూడా చేస్తాడు.

జీవుడు శరీరంతో సారూప్యం చెందడటంవల్ల శరీరానికి ఏ కష్టంకలిగినా తనకే కలిగినట్లు అనుభవమౌతుంది. తనవారిపై మోహం పెంచుకోవటంవల్ల వారికి ఏ కష్టనష్టాలు కలిగినా తనకే కలిగినట్లు మదనపడతాడు. మృత్యువంటే మరీ మరీ వణకిపోతాడు. ఈ దేహాత్మభ్రాంతి, సంసారమోహం చాలా బలంగా ఉంటాయి. ఎంతటి భౌతిక విద్యావిజ్ఞానాలు కలిగినవారైనా ఈ అవిద్యాది క్లేశాలకు గురియౌతారు. వీటన్నిటినుండి బయటపడాలంటే ఆధ్మాత్మికవిద్య నభ్యసించకతప్పదు. ఆధ్యాత్మిక విద్యను కేవలం విన్నంతమాత్రాన, చదివినంతమాత్రాన సరిపోదు. మనన నిధిధ్యాసనములు చెయ్యాలి. అప్పుడుకూడా కొంత ఉపశమనం మాత్రమే కలుగుతుంది. దానిని సాధనచేసి సాక్షాత్కారం చేసుకున్నప్పుడు మాత్రమే అవిద్య విడిపోతుంది. ఆ సాధన చేయటానికీ సంసారమోహంనుండి బయపడటానికీ వానప్రస్థాశ్రమం చాలా ఉపకరిస్తుంది.

## పరమాత్మ స్వరూపము

జీవాత్మ తన స్వరూపంతో బాటు పరమాత్మ స్వరూపం తెలుసుకోవటమూ అవసరమే. ఈ బ్రహ్మాండాలను, అందలి చిత్రవిచిత్ర ప్రాణిజాతులను సృజించి పాలించి పోషించే ఈశుడు - పరమేశ్వరుడు విశ్వమంతా వ్యాపించి యున్నాడని చెబుతుంది వేదం .

**"ఈశావాస్య మిదం సర్వం యత్కించ జగత్యాం జగత్"** (యజుర్వేదం. 40-1)

గతిశీలమైన ఈ జగత్తంతా అణువులుమొదలు బ్రహ్మాండములవరకు ఈశునిచే నియమించి నడుపబడుతోంది. అది అత్యంత సూక్ష్మపదార్థం కావటంవల్ల జగత్‌రచనకు మూల పదార్థమైన పరమాణువులలోను, జీవాత్మలలోను కూడా వ్యాపించి ఉంది. ఇనుమును అగ్నిలోపెట్టి బాగా కాలిస్తే అందులోకి అగ్ని ప్రవేశించి ఉండునట్లుగా, నీటిలో ముంచిన దూది బొమ్మలలోనికి నీరు ప్రవేశించి ఉండునట్లుగా పరమాత్మ ప్రకృతిలోను, అత్యంత సూక్ష్మతత్త్వములైన జీవాత్మలలోను వ్యాపించి ఉంది. అది సర్వజ్ఞము, సర్వశక్తిమంతము. ఎవరి సహాయం లేకుండానే ఆ పరమాత్మ సృష్టి స్థితి ప్రలయాలను చేస్తున్నది. దానిలో ప్రకృతి గుణాలైన శబ్ద స్పర్శ రూప రస గంధాదులు లేకపోవడంచే జీవాత్మలవలె అదియును మన

యింద్రియాలకు కనబడదు. ఏ జీవాత్మ అంతర్ముఖమై తనలో వ్యాపించియున్న పరమాత్మను వెదుక ప్రయత్నిస్తుందో, సాధన చేస్తుందో అట్టి జీవాత్మకు సాధన పరిపక్వమైనపుడు అది కనబడుతుంది. అంటే- అనుభవమౌతుంది. అప్పుడు జీవాత్మకు కలిగే ఆనందం అపారం. దానిని మాటలలో వర్ణించలేరట.

అట్టి ఆనందస్వరూప పరమేశ్వరుని అనుపశ్యతులై దర్శించిన జీవాత్మలు ఈ లోకంలో పరమశాంతిని పరమానందాన్ని పొందుతారు. దేహపతనానంతరం ముక్తిని పొందుతారు. సమస్త దుఃఖాలనుండి విముక్తిని పొంది పరమేశ్వరుని తృతీయధామంలో స్వేచ్ఛగా పరాంతకాలం వరకు విహరిస్తారని మన శాస్త్రాలు చెబుతాయి. అనుపశ్యతులంటే ముందుగా తన ఆత్మను దర్శించి, అనంతరం తనలో వ్యాపించియున్న పరమాత్మను దర్శిస్తారని అర్థం. పరాంతకాలం అంటే- 3, 11, 04,000 కోట్ల సంవత్సరాలు. ఇట్టి ముక్తిని పొందటమే మానవుల పరమ పురుషార్థం అంటారు మన ఋషులు. అందుకొరకే వారు వానప్రస్థాశ్రమాన్ని ఏర్పరచారు.

అయితే, ఈ జన్మలోనే ఆ లక్ష్యాన్ని చేరుకోగలమా? అని కొందరికి సందేహం కలుగవచ్చును. అది మన సాధననుబట్టి ఉంటుంది. మనం సాధనను ప్రారంభించి శక్తికొలది ప్రయత్నిస్తూవుంటే క్రమంగా అంతర్యామియైన పరమాత్ముని సహాయం లభిస్తుంది. ఈ జన్మలో కొంత ప్రయాణం చేస్తే అది మన సూక్ష్మ శరీరంలో సంస్కారంగా ఉండి, అది మనవెంట మరొక శరీరంలోకి వస్తుంది. ఈ విధంగా అంచెలంచలుగా మనం పరమాత్మను పొందవచ్చు.

ఈ జ్ఞానంతోబాటు 'పరమాత్మ ఒకే ఒక్కడు' అనే జ్ఞానం చాలా అవసరం. అతడొక్కడే సృష్టి స్థితి ప్రలయాలు చేస్తున్నాడు. మానవులు మనో వాక్కాయాలతో చేసే సర్వకర్మలను ఎరుగుతూ వాటికి తగిన ఫలాలనిస్తున్నాడు. 'దుష్టశిక్షణ శిష్టరక్షణ కొరకు అవతారాలెత్తుతున్నా' డనేదికూడా సత్యం కాదు. అతడు సర్వాంతర్యామి కనుక అవతారమెత్తకుండానే దుష్టులను శిక్షించగలడు. చంపగలడు. ఆ ఏకేశ్వరునికే అనేక నామాలున్నాయి. అవి అతని గుణకర్మ స్వభావాలను, వివిధ శక్తులను తెలిపేవి మాత్రమే. అంతేకాని, నామానికి ఒక ఆకారం కల్పించి, ఆయనకుకూడా భార్యపిల్లలను రాగద్వేషాలను అంటగట్టటం మంచిది కాదు.

## ప్రకృతి స్వరూపము

జీవాత్మ పరమాత్మల జ్ఞానంతోబాటు ప్రకృతిజ్ఞానమునూ కొంత అవసరమే. ఈ ప్రకృతి త్రిగుణాత్మకము. అంటే- సత్వము, రజస్సు, తమస్సు అనే పేర్లుగల మూడు రకాల పరమాణువుల సంఘాతము- కలయిక. వీటిని మనం నేటి వైజ్ఞానికులు చెప్పే ప్రోటాన్, ఎలక్ట్రాన్, న్యూట్రాన్‌లతో పోల్చవచ్చు. ఈ సృష్టిలోని సమస్త పదార్థాలు ఈ మూడు రకాల పరమాణువుల వివిధ నిష్పత్తులలో జరిగిన మేళవింపే. ఈ పరమాణువులు సామ్యస్థితిలో ఉన్నపుడు అది ప్రకృతి అనబడుతుంది. అప్పుడది ఇంద్రియగోచరముకాదు. అట్టి ప్రకృతిని క్షోభింపజేసి పరమాత్మ వివిధ నిష్పత్తులలో ఆ పరమాణువులను మేళవించి, రాసాయనిక బంధనాల నేర్పరచి వివిధ మూలకాలను చేశాడు. ఆ మూలకాలను (ఎలిమెంట్స్‌ను) వివిధ రకాలుగా కలిపి వివిధ ప్రపంచపదార్థాల సృజించాడు. సూక్ష్మపదార్థాలైన ఇంద్రియాలు, మనస్సు, బుద్ధికూడా ప్రకృతినుండి ఏర్పడినవే నంటాయి మన శాస్త్రాలు.

**శ్లో॥ భూమి రాపో ఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవచ ।**
**అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా ॥** (భగవద్గీత. 7-4)

భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము నని ప్రకృతి 8 విధములుగా పరిణమించిం"దని భగవద్గీత చెబుతుంది. వీటిలోనే శబ్ద స్పర్శ రూప రస గంధాదులుంటాయి. అవి మనకు మన ఇంద్రియాల ద్వారా తెలియబడుతున్నాయి. కనుక, మన యింద్రియాల ద్వారా తెలియబడేవన్నీ ప్రకృతి గుణాలే. అవి పరమాత్మవి కావు.

ఆధ్యాత్మికంగా ప్రకృతి సంబంధమైన జ్ఞానం వానప్రస్థులకు ఇంతమాత్రం సరిపోతుంది. కాని, బ్రహ్మచారులు, గృహస్థులు ప్రకృతి జ్ఞానాన్ని ఎంతగా పెంచుకుంటే అంతగా వారికి మేలు కలుగుతుంది. విజ్ఞాన సాంకేతిక రంగాలు (సైన్స్ & టెక్నాలజి) వికసించి ఎన్నో సుఖసాధనాలు సమకూరతాయి. వారిది ప్రవృత్తి మార్గం. వానప్రస్థులు (వృద్ధులు) విషయసుఖాలకొరకు కాక పరమాత్మ ప్రాప్తికి ప్రాకులాడాలి.

## త్రివిధ అనాది పురుషులు

అనాది పదార్థాలైన జీవాత్మ, పరమాత్మ, ప్రకృతుల గురించి వివరించే మంత్రాలు

వేదాలలో వేలకొలది ఉన్నాయి. దర్శన ఉపనిషదాదులందును విస్తృతంగా ఉన్నాయి. నేడు జగత్ప్రసిద్ధిని పొందిన భగవద్గీతయందును అనేక శ్లోకాలున్నాయి. ఉదాహరణగా అందులోనివి రెండు శ్లోకాలను తెలుసుకొందాము.

శ్లో॥ ద్వా విమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ ।
క్షర స్సర్వాణి భూతాని కూటస్థో౽క్షర ఉచ్యతే ॥
శ్లో॥ ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః ।
యో లోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః ॥ -భగవద్గీత (15-16, 17)

ఈ సృష్టిలో క్షరపురుషుడు, అక్షరపురుషుడు నని రెండు రకాల పురుషు లున్నారు. వారిలో పంచభూతాలతో ఏర్పడిన ప్రాపంచిక పదార్థాలన్నీ క్షరపురుషుడు. అంటే, నశించే పురుషుడు. ఇచట నాశనమంటే 'కారణలయః' - తన కారణంలో లయించిపోవటం. ప్రపంచలోని పదార్థాలు సదా మార్పుచెందుతూ వుంటాయి. చివరకు నశించిపోతాయి. ఇక్కడ అలంకారకంగా వాటిని క్షరపురుషు దన్నారు. రెండవ పురుషుడు కూటస్థుడు. జీవాత్మ అంటే-పాంచభౌతిక శరీరంలో జీవాత్మ కూటస్థుడుగా ఉంటాడు. అతడు అక్షరుడు. నశించేవాడు కాదు. ఎప్పటికీ ఉంటాడు. కూటస్థుడంటే కొన్ని అవయవాల సమూహంతో ఏర్పడిన శరీరంలో ఉండేవాడని అర్థం.

ఈ రెండు రకాల పురుషులేకాక మరొక ఉత్తమ పురుషు డున్నాడు. అతడినే పరమాత్మ అంటాయి శాస్త్రాలు. ఆ పరమాత్మతత్త్వం భూలోక భువర్లోక స్వర్లోకము లనే మూడులోకాలలోను వ్యాపించి వాటిని ధరించి ఉంది. అది అవ్యయము నశించనది. అది ఈశ్వరుడు - అన్నిటికి స్వామి.

## చరిత్రలో వానప్రస్థాశ్రమం

మన వైదిక సంస్కృతీ చరిత్ర 192 కోట్ల సంవత్సరాలకుపైగానే ఉంది. లక్షల కోట్ల సంఖ్యలో గ్రంథాలుండేవి. వాటిలో 99శాతం కాలగర్భంలో కలిసిపోయాయి. కొన్ని పాక్షిక ప్రళయాలలో నశించిపోగా మరికొన్ని విదేశీ ఆక్రమణలలో అగ్నికి ఆహుతియయ్యాయి. ఇప్పుడు మిగిలివున్న వైదిక సాహిత్యంలో పరమేశ్వరీయ జ్ఞానమైన వేదాలు, స్వాయంభువ మనుమహర్షి రచితమని చెప్పబడుచున్న మనుస్మృతి ప్రధానమైనవి. వేదాలలో వానప్రస్థాశ్రమ సంకేతాలు చాలానే ఉన్నాయి. అందులో పెద్దలను పితరులని చెప్పబడింది. పితరులంటే జీవించియున్న పితరులనియే అర్థం. మనుస్మృతిలో వానప్రస్థాశ్రమ విధివిధానాలు, నియమాలు వ్రాయబడి ఉన్నాయి.

శ్లో॥ ఏవం గృహాశ్రమే స్థిత్వా విధివత్ స్నాతకో ద్విజః ।
వనే వసేత్తు నియతో యథావ ద్విజితేంద్రియః ॥ - మనుస్మృతి (6-1)

గురుకులంలో స్నాతకుడై గృహస్థాశ్రమంలో ప్రవేశించి అనంతరం వనములలో వసిస్తూ విజితేంద్రియుడై స్వాధ్యాయ జపధ్యానాదులలో గడపాలని మనుస్మృతి చెబుతుంది.

అనంతర సాహిత్యం గురించి మనకు బాగా తెలియదుకాని రఘువంశ రాజుల కాలంలో వానప్రస్థాశ్రమం పాటించేవారని ఈ క్రింది శ్లోకం ద్వారా తెలుస్తున్నది.

**శ్లో॥ శైశవే అభ్యస్త విద్యానాం, యౌవ్వనే విషయైషిణామ్ ।**
**వార్ధక్యే మునివృత్తీనాం, యోగేనాన్తే తనుత్యజామ్ ॥**

- రఘువంశకావ్యం (కాళిదాస విరచితము)

రఘువంశరాజులు బాల్యావస్థలో గురుకులాలలో చేరి అచ్చటి నియమాలన్నీ పాటించి వేదాది సత్యశాస్త్రాల నభ్యసించేవారు. చక్కటి యవ్వనం ప్రాప్తించిన అనంతరం గృహస్థాశ్రమంలో ప్రవేశించి ధర్మపూర్వకమైన లౌకిక సుఖాల ననుభవించేవారు. వార్ధక్యం ప్రాప్తించిన వెంటనే (మనుమడు కలిగిన తదుపరి) వానప్రస్థులై మునివృత్తిలో గడిపేవారు. చివరిదశలో యోగారూఢులై సర్వవ్యాపక సచ్చిదానంద సర్వేశ్వరుని ధ్యానిస్తూ జన్మరాహిత్యాన్ని - ముక్తిని కోరుతూ శరీరాన్ని వదలిపెట్టేవారు.

'మునివృత్తి' అంటే చదివిన శాస్త్రాలనుగురించి, ఆత్మ పరమాత్మలను గురించి మననం చేస్తూ యోగసాధనలో గడపటం. దిలీప మహారాజు వానప్రస్థాశ్రమం స్వీకరించి వనాలకు వెళ్ళి తాపసిక జీవనం గడిపినట్లు రఘువంశకావ్యంలో ఉంది. రఘువంశ కులదీపకుడైన శ్రీరాముడును ఇదే బాటలో నడిచి ఉండవచ్చు.

5016 సంవత్సరాల పూర్వం జరిగిన మహాభారతకాలంనాడును వానప్రస్థాశ్రమప్రథ ఉన్నట్లు స్పష్టమైన ఆధారాలున్నాయి. వ్యాస మహాభారతంలోని ఆశ్రమవాసపర్వం ఈ విషయాన్ని ధృవపరుస్తున్నది.

భారతయుద్ధానంతరం కొడుకుల నందరిని పోగొట్టుకున్న ధృతరాష్ట్రుడు అంధుడగుటచే పాండవుల ఆదరణలో ఉండవలసి వచ్చింది. ధర్మరాజు మొదలైనవారంతా ధృతరాష్ట్ర గాంధారీ దేవులను శ్రద్ధాభక్తులతో సేవించుచున్నప్పటికీ దుడుకు స్వభావంగల భీముడు సూటిపోటీ మాటలతో ఆ వృద్ధ దంపతులను బాధించేవాడు. ఒక ప్రక్క ఈ బాధ, మరొక ప్రక్క స్వపుత్రవియోగ దుఃఖం వారిని

బాధించేవి. అప్పుడు వానప్రస్థాశ్రమం స్వీకరించి వనాలకు వెళ్ళటమే అన్నివిధాల మంచిదనే ఆలోచన వచ్చింది. ముందుగా ధర్మరాజు దీనికి అంగీకరించడు. వ్యాసమహర్షి నచ్చచెప్పిన తరువాత యిష్టంలేకున్నా ధర్మరాజు అంగీకరిస్తాడు. గాంధారీదేవికూడా భర్త ననుసరించి వనాలకు వెళ్ళటానికి సిద్ధమయ్యింది. వీరిద్దరి ననుసరిస్తూ కుంతీదేవియును 'నా పని యిక్కడ పూర్తయినిది. నేనును వనాలకు వెడతా'నని బయలుదేరింది. వీరితోబాటు సంజయుడు, అగ్నిహోత్రం చేయించే పురోహితుడు కూడా వారివెంట వనాలకు వెళ్ళినట్లు మహాభారతం ఆశ్రమవాస పర్వంలో ఉంది.

ధృతరాష్ట్రుడు పుట్టంధుడయితే, గాంధారీదేవి పాతివ్రత్యమనే మూఢనమ్మకంతో కళ్ళకు గంతలు కట్టుకుని అంధురాలైన విషయం అందరకు తెలసినదే. అట్టి అంధదంపతులునూ వానప్రస్థులు కావటం విశేషమే. కుంతీదేవి మహారాణి. రాజమాత. ఆమెయు వారి ననుసరించటం మరింత విశేషం. దీనినిబట్టి ఆనాటివరకు వైదిక సంస్కృతీప్రథ, వర్ణాశ్రమధర్మాలు కొంతవరకు బాగానే జరిగినట్లు తెలుస్తున్నది.

కొంతకాలం అక్కడ వారు కఠోరమైన తాపసికులుగా గడిపారు. ధృతరాష్ట్ర గాంధారీ కుంతీదేవులు తరచుగా ఉపవాసాలు చేసేవారు. వెంటవచ్చిన పురోహితుడు నిత్యం వారిచే అగ్నిహోత్రంలో ఆహుతు లిప్పించేవాడు. వారు ఒకచోట స్థిరంగా ఉండకుండా ఆశ్రమాలు, నదీతీరాలు తిరుగుతూ దూరదూర ప్రాంతాలకు వెళ్ళేవారు. సత్సంగాలలో గడిపేవారు. ఎత్తుపల్లాలతోవున్న దారులు వచ్చినపుడు ధృతరాష్ట్రున్ని సంజయుడు చేయిపట్టుకుని నడిపింపగా, కుంతీదేవి గాంధారిని పట్టుకుని నడిపించేది.

ఒక దినము వారు దూరంగావున్న ఒక నదికి స్నానార్థం వెళ్ళారు. వారు స్నానం చేసి వస్తూండగా దురదృష్టవశాత్తు అడవికి నిప్పంటుకుంది. జంతువులన్నీ పరుగులు తీసి దూరంగా పారిపోయాయి. కొన్ని నదిలో మునిగాయి. వీరు నలుగురు అగ్నిలో చిక్కుకుపోయారు. ధృతరాష్ట్ర గాంధారీలకు పరుగులు తీసి తప్పించుకునే శక్తి లేకపోయింది. వారి కోరికమేరకు సంజయుడు మాత్రం ఎట్లో తప్పించుకుని పారిపోయాడు. కుంతీదేవి వదలి వెళ్ళనన్నది. ధృతరాష్ట్ర గాంధారీ కుంతీదేవులు పద్మాసనం వేసుకుని ధ్యానమగ్నులై అగ్నికి ఆహుతులయ్యారు.

దీనినిబట్టి మహాభారత కాలంనాడును వానప్రస్థాశ్రమం ఉండేది. వార్ధక్యంలో తాపసికులుగా వనాలలో గడిపేవారు. అయినా నిత్యాగ్నిహోత్రం చేసేవారు. స్వాధ్యాయ సత్సంగాలలోను, యోగాభ్యాసంలోనూ గడపేవారు. రాజులే ఆ

విధంగా గడిపినప్పుడు సామాన్యులును వారి ననుకరించి వుండేవారిని ఊహించవచ్చు. మహాభారతానంతరం క్రమంగా ఈ దేశంలో వైదిక ధర్మప్రచారం తగ్గిపోయింది. దానితో మన సంస్కృతీ సభ్యతలు కనుమరుగైపోతున్నాయి.

## వానప్రస్థం - ఒక సంస్కారం

మానవ శరీరంలో ప్రవేశించిన జీవాత్మను సంస్కరించి మహాత్ముని చెయ్యాలనీ, చివరకు ముక్తిని పొందేలా చేయాలనీ వేదాల ఆధారంగా మన మహర్షులు ఒక జీవన ప్రణాళికను రూపొందిచారు. అదే 'షోడశ సంస్కార ప్రణాళిక'. జీవుడు తల్లి గర్భంలో ప్రవేశించినప్పటినుండి ఆ ప్రణాళిక ప్రారంభమౌతుంది. ఆ మొదటి సంస్కారానికి 'గర్భాధాన సంస్కార' మని పేరు. జీవుడు గర్భంలో ఉండగానే మరి రెండు సంస్కారాలు పుంసవన, సీమంతోన్నయనాలు చేయబడతాయి. పుట్టిన వెంటనే జాతకర్మ, కొన్ని దినాల తరువాత నామకరణం చేయబడతాయి. వయసు పెరిగే కొలది నిష్క్రమణ అన్నప్రాశన చూడాకర్మ కర్ణవేధ సంస్కారాలు జరుగుతాయి. ఇవన్నీ బిడ్డ ఆరోగ్యాన్ని వృద్ధిచేసే సంస్కారాలు.

మనస్సును, బుద్ధిని, ఆత్మను సంస్కరించే సంస్కారాలు ఉపనయన సంస్కారంతో ప్రారంభమౌతాయి. అనంతరం వేదారంభ సమావర్తన వివాహ సంస్కారాలు జరుగుతాయి. అప్పటినుండి రెండవ ఆశ్రమం గృహస్థాశ్రమం ప్రారంభమౌతుంది. దానినుండి వానప్రస్థాశ్రమంలో ప్రవేశించబోయేముందు 'వానప్రస్థాశ్రమ సంస్కారం' చేసుకోవాలి. దీనిలో బృహద్ యజ్ఞంతోబాటు స్థాలీపాకంతో విశేషహోమం ఉంటుంది. ఆ విశేష హోమమంత్రాలతో తా నింతవరకు ఏఏ పదార్థాలనుండి, ఏఏ వ్యక్తులనుండి సుఖాలు పొందాడో వాటన్నిటిని గుర్తుచేసుకొని వాటన్నిటికి ధన్యవాదాలు తెలుపుతాడు. తన శరీరంలోని ప్రాణశక్తులు, ఇంద్రియశక్తులు, మనో వాక్కాయములు శక్తివంతములు కావాలని కోరుతూ ఆహుతులనిస్తాడు. భార్యకూడా తనవెంట వస్తూవుంటే ఆమెకూడా విశేషాహుతులనిస్తుంది. దీని తరువాతది సంన్యాస సంస్కారం. అది యోగ్యులైన వారికి మాత్రమే చేయబడుతుంది.

<u>సంన్యాసాశ్రమానికి అర్హతలు :-</u> సంన్యాసి సాంగోపాంగ వేదాధ్యయనం చేసినవాడైఉండాలి. ధర్మశాస్త్రాలను క్షుణ్ణంగా అభ్యసించినవాడై ఉండాలి. దేశ సంచారంచేస్తూ గృహస్థులకు కలిగే ధర్మసందేహాలన్నిటిని తీర్చగలిగిన సమర్థుడై ఉండాలి. ఎక్కడనైనా వేదవిరుద్ధమైన, ధర్మవిరుద్ధమైన సాంప్రదాయాలు తలెత్తూతూ

వుంటే వాటిని శాస్త్రార్థంతో ధైర్యంగా ఖండించగలగాలి. ప్రజలను మూఢనమ్మకాల నుండి తప్పించి సత్యమార్గంలో నడుపగలగాలి. పక్షపాతరహితుడై ధర్మం ఉపదేశించాలి. ఒకేచోట స్థిరనివాసమేర్పరచుకొనక వసుధైవ కుటుంబికునిగా దేశసంచారం చేస్తూ ఉండాలి. రాజు అయినప్పటికి అన్యాయం అధర్మం ఆచరిస్తూవుంటే నిర్భయంగా హెచ్చరించగలగాలి. ముఖ్యంగా ఈషణత్రయాలను జయించినవాడు, సర్వభూత హితైషి కావాలి.

పై యోగ్యతలు కలిగినవారు చాలా అరుదుగాఉంటారు. వానప్రస్థిగా సాధనచేసి కొందరు యోగ్యతను సంపాదించుకోగలుగుతారు. అట్టివారు సంస్కారవిధి పూర్వకంగా సంన్యాసాశ్రమం స్వీకరించవచ్చు. అది అన్నిటికన్న గొప్పది. అట్టి సంన్యాసిని అన్ని వర్ణములవారు, అన్ని ఆశ్రమములవారు పూజించవలసినదే. సత్కరించవలసినదే.

చివరది అంత్యేష్టి సంస్కారం - శవదహనం. ఇది అందరకు విధిగా చేయవలసినదే. శవాలను పూడ్చిపెట్టడం మంచిదికాదు. పంచభూతాత్మకమైన శరీరాన్ని దహించి వెంటనే పంచభూతాలలో కలిపివేయటమే ఉత్తమం.

## ఆధునిక వానప్రస్థాశ్రమం

నేటి దేశకాల పరిస్థితులలో వానప్రస్థాశ్రమం స్వీకరించి వైరాగ్యసాధన, యోగసాధనా చెయ్యగలమా ? అనేది చివరి ప్రశ్న. 'మనసుంటే మార్గముంటుందంటారు' పెద్దలు. ఆ సూక్తి ననుసరించి మనం ప్రాచీన వానప్రస్థాశ్రమ నియమాలను నేటికాలానికి అన్వయించుకోవచ్చు. లక్ష్యం మాత్రం సంసారమోహాన్ని తగ్గించుకోవటం, పరమాత్మప్రేమను పెంచుకోవటంగా ఉండాలి.

వనాలకు వెళ్ళటానికి బదులుగా ప్రకృతి రమణీయ ప్రశాంత ప్రదేశాలలో వానప్రస్థాశ్రమాలు నిర్మించుకొని 60 సంవత్సరాలు పైబడినవారంతా అక్కడకు చేరుకోవాలి. కందమూలాలకు బదులుగా అన్నము, రొట్టె, ఉడికించినకూరగాయలు, పాలు, పండ్లు తీసుకోవచ్చు. ఉప్పుకారాలు మితంగా వాడుకోవచ్చు. ఇవన్నీ ఆరోగ్యానికి మేలు చేసేవే. ప్రాకృతిక చికిత్సలు వంటివి. జీర్ణశక్తి బాగా ఉన్నవారు ఒకపూట అపక్వాహారంగా కూరగాయలు పచ్చివి తినటం మంచిది. SSY, MMY వంటి కొన్ని యోగ తరగతులు నిర్వహించే సంస్థలు ఈ పద్ధతిని అనుసరిస్తున్నాయి. వాటివల్ల శారీరక ఆరోగ్యం, మానసిక ఆరోగ్యం చక్కబడుతున్నట్లు చెబుతున్నారు.

వానప్రస్థులు నిత్యం పంచమహాయజ్ఞాలు విధిగా చెయ్యాలని మనుస్మృతి

చెబుతుంది. అంటే- నిత్యం ఉదయ సాయంకాలలో సంధ్యాగ్నిహోత్రాలు చెయ్యాలి. తనతో పితరులు - తల్లి తండ్రిపంటివారు ఎవరైనా వుంటే వారికి సేవాశుశ్రూషలు చేసి భోజనాదులు పెట్టాలి. తనను ఆశ్రయించుకొనియున్న గోపులు మున్నగువాటికి ఆహారం పెట్టాలి. అతిథులుగా సాధువులు, సంన్యాసులు వస్తే వారికి కూడా భోజనం పెట్టాలి. మనం తినే భోజనమే పెట్టవచ్చు. ప్రత్యేక వంటలు చేయనక్కరలేదు.

కుమారులు, బంధువులు చూడటానికి వస్తే వారిచ్చినవి తీసుకొని, మన భోజనమే పెట్టి పంపవచ్చు. కాని, వారిపై మనం మోహాన్ని పెంచుకోకూడదు. మనం పెండ్లిళ్లకు, విందులకు, వినోదాలకు వారి యిండ్లకు పోకూడదు. ఇది తప్పుకాదు. క్రమంగా వారు మన తాపసిక జీవనాన్ని అర్థం చేసుకుంటారు. ఒకవేళ చాలా బలవంతం చేస్తే వెళ్ళి అక్కడ నిర్లిప్తంగా గడపి, మంచిమాటలు ఉపదేశించి, మనసారా ఆశీర్వదించి రావటం మంచిది. దానివల్ల మన గౌరవం పెరుగుతుందేకాని తగ్గదు.

వానప్రస్థులు శక్తివంచన లేకుండా ప్రజాసేవా, దేశసేవా చేయాలి. అయితే అది వారి తాపసిక జీవనానికి అడ్డుకాకూడదు. పూర్వం వానప్రస్థులు గురుకులాలు నడిపేవారట. విద్యావిజ్ఞానాలను నేర్పేవారట. అధ్యాపన సమర్థులు ఉపాధ్యాయులుగా ఉంటే, మిగిలినవారు వ్యవస్థాయేర్పాట్లు చేసేవారట. ఇప్పుడును ఆ విధంగా చెయ్యవచ్చు. అప్పుడు విద్య ఉచితంగా లభిస్తుంది. విద్యార్థులకు విద్యతోబాటు సదాచారం, ప్రేమ, ప్రేరణలు లభిస్తాయి. అప్పుడు వారు గొప్పవారై భావితరాలను ఆదర్శంగా నిర్మించగలుగుతారు.

వైద్యులు ఉచిత చికిత్సలను చేయవచ్చు. న్యాయవేత్తలు ఉచిత న్యాయము నందించవచ్చు. ఇట్లే మిగిలిన రంగాలవారును వారికి తెలిసినవి నేర్పవచ్చు. ఎవ రే సామార్థాలను కలిగివుంటారో వా రా సామార్థ్యాలను సమాజ సేవకు వినియోగించవచ్చు.

ఈ విధంగా చేస్తే వారి హృదయాలు విశాలమౌతాయి. రాగద్వేషాలు శాంతిస్తాయి. ముఖ్యంగా విత్తేషణ దారేషణ లోకేషణ మానవులను వక్రమార్గానికి నడిపిస్తాయి. వాటిని జయించే ప్రయత్నం చెయ్యాలి. ఈ లోకంలో ఎంత ధనాన్ని ఐశ్వర్యాలను సంపాదించినా, ఎంతమంది బంధువులను అనుచరులను సమకూర్చుకోగలిగినా, ఎంతటి పేరు ప్రఖ్యాతులు సన్మానాలు పొందినా ఇవియేవీ మనవెంట రావు. మనం సంపాదించిన ధర్మము, పాపపుణ్యాలు, సాధనా మాత్రమే మన వెంటవస్తాయి.

మహర్షి మనువు వానప్రస్థులకు కొన్ని విధి విధానముల నుపదేశించాడు. అందు ముఖ్యమైనవి ఏవంటే –

శ్లో॥ స్వాధ్యాయే నిత్యయుక్తః స్యాత్ దాన్తో మైత్రః సమాహితః ।
దాతా నిత్యమనాదాతా సర్వభూతానుకంపకః ॥ – (మనుస్మృతి (6-7)

వానప్రస్థి నిత్యం స్వాధ్యాయ నిరతుడై ఉండాలి. వేదశాస్త్రాలను తాను చదువుచు ఇతరులచే చదివిస్తూ ఉండాలి. మనన నిధిధ్యాసనములు చేస్తుండాలి. ఇంద్రియ నిగ్రహపరుడై ఇతరులయెడ మైత్రీభావన కలిగి ఉండాలి. తనవద్ద ఉన్నది దానము చేయుటకే యత్నించాలికాని, తనకొరకు దానములను సంగ్రహించ యత్నించకూడదు. (సమాజసేవకొరకైతే దానము గ్రహించవచ్చు). అన్ని భూతాలయందు– ప్రాణుల యందు దయకలవాడై ఏ ప్రాణిని హింసించకూడదు.

అనివార్య కారణాలవల్ల విధిలేక ఇంట్లోనే ఉండిపోవలసి వస్తే మానవ జీవిత లక్ష్యం మరచిపోకండి. ప్రకృతిపై రాగాన్ని తగ్గించుకుంటూ పరమాత్మవైపు పయనించండి. ఉదయ సాయంకాలాలలో నియమంగా సంధ్యోపాసన చెయ్యండి. ఆత్మ పరమాత్మల గురించి వివరించే వేదాలు ఉపనిషత్తులు భగవద్గీత మొదలగు గ్రంథాలను స్వాధ్యాయం చేయండి. ఆ విషయాలను గురించి ఆలోచిస్తూ సమాన భావాలు కలవారి స్నేహ సత్సంగాలలో గడపండి. వీలైనంత ఎక్కువగా సమాజ సేవా కార్యాలు చేయండి. ఇవన్నీ మీ సూక్ష్మశరీరంలో సంస్కారాలుగాఉండి వచ్చే జన్మలో మీకు అనేక సానుకూలతలను ప్రసాదిస్తాయి. అస్తు.

**శుభం భూయాత్**

శమ్ ఇతి ఓ3మ్

# గాయత్రీ ఆశ్రమ ట్రస్టు వారి పుస్తకముల పట్టిక

| | | |
|---|---|---|
| 1. | గాయత్రీ మహిమ | 30-00 |
| 2. | గాయత్రీ విజ్ఞానం | 100-00 |
| 3. | మన ఇతిహాసం | 70-00 |
| 4. | మన వేదశాస్త్రాల పరిచయం | 70-00 |
| 5. | అగ్నిహోత్రం 100శాతం వైజ్ఞానికం | 60-00 |
| 6. | అగ్నిహోత్ర రాసాయనిక విశ్లేషణ * | |
| 7. | అగ్నిహోత్ర ఆధ్యాత్మిక స్వరూపము | 30-00 |
| 8. | గోమాత | 40-00 |
| 9. | వేదాలలో సూర్యకిరణ చికిత్స | 80-00 |
| 10. | వేదాలలో జలచికిత్సా విజ్ఞానం | 60-00 |
| 11. | సింక్షిహాట్ ప్రమాణాలు | 40-00 |
| 12. | గర్భాదాన విజ్ఞానం | 50-00 |
| 13. | దౌహృదిని | 40-00 |
| 14. | మరణానంతరం జీవుని ప్రయాణం | 40-00 |
| 15. | మానవ ధర్మము | 40-00 |
| 16. | ఈశావాస్యమిదం సర్వం * | |
| 17. | దేవుడు - జీవుడు - ప్రకృతి | 25-00 |
| 18. | వేదాలలో అశ్వనీదేవతలు | 20-00 |
| 19. | సంధ్యావందనం - వైజ్ఞానిక సమాలోచన | 50-00 |
| 20. | జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ * | |
| 21. | వేదాల వెలుగుచూపే ఆర్యసమాజము | 30-00 |
| 22. | వైదిక జన్మదిన వేడుక | 30-00 |
| 23. | పండుగల పరమార్థం | 40-00 |
| 24. | వైదిక గృహప్రవేశ విధి | 30-00 |
| 25. | వేదాలలో వర్షేష్టి విజ్ఞానం | 25-00 |
| 26. | వైదిక క్రాంతి పథం | 40-00 |
| 27. | పురుషసూక్తము | 20-00 |
| 28. | వైదిక శాంతి పాఠం (వైజ్ఞానిక వ్యాఖ్య) | 20-00 |
| 29. | సృష్టికథ | 20-00 |
| 30. | సరస్వతీ సూక్తము | 10-00 |
| 31. | స్వతంత్ర సముపార్జనలో దయానందుడు | 10-00 |
| 32. | వైదిక సంస్కృతిలో వానప్రస్థాశ్రమము | 15-00 |
| 33. | గంగాధర శివుడు | 10-00 |
| 34. | ప్రణవస్తోత్రము | 10-00 |
| 35. | విశుద్ధ లక్ష్మీసూక్తము | 20-00 |
| 36. | వేదాలలో మనోవిజ్ఞానం | 20-00 |
| 37. | వేదామృతం * | |
| 38. | వైదిక సుప్రభాతం * | |
| 39. | శివరాత్రి రహస్యము * | |
| 40. | గణపతి రహస్యము | 20-00 |
| 41. | వేదాలలో దేశభక్తి | 50-00 |
| 42. | వేదాలలో దశ నియమములు * | |

ఇతర విద్వాంసుల రచనలు

| | | |
|---|---|---|
| 1. | మాతాపుత్రికల జ్ఞాన చర్చ | 60-00 |
| 2. | సత్యధర్మ విచారణ | 6-00 |
| 3. | స్వరాజ్యసంగ్రామములో ఆర్యసమాజము | 20-00 |
| 4. | ధర్మవీర్ పం. లేఖరామ్ | 5-00 |
| 5. | వేదాలలో విజ్ఞానబీజాలు | 30-00 |

Gayatri Series : 46

Vaidika Samskrutilo

VANAPRASTHASHRAM

Rs. 15/-



## పరమేశ్వర ఉవాచ:

ఉద్యానం తే పురుష నావయానం
జీవాతుం తే దక్షతాతిం కృణోమి ।
ఆ హి రోహేమ మమృతం సుఖం రథమ్
అథ జిర్వి విదథమా వదాసి ॥ (అథర్వవేదం. 8-1-6)

ఓ మానవా ! ఉత్తమ కర్మల నాచరించి ఉన్నతిని పొందుము. అధమ కర్మల నాచరించి అవనతిని పొందవద్దు. నేను నీకు జీవితాన్ని దక్షతను ప్రసాదిస్తున్నాను. ఈ ఉత్తమ సుఖకారక మానవ శరీరాన్ని అధిరోహించి అమరత్వాన్ని పొందు. యజ్ఞమయ జీవితంతో వృద్ధుడవై నీ అనుభవాలను తోటి మానవుల కందించి ఆదర్శ పురుషుడవు కమ్ము.

O Man! Make progresses, don't regress. I give you both vitality and energy. Ride on the chariot of human body, which is Joyful and a cause of Immortality. preach knowledge and wisdom till the end of life.

*Published by :*

**Gayatri Ashram Trust,**

Arya Samaj - Vyasnagar, Medibavi, Warasiguda,
Secunderabad - 500 061. Cell : 9290604641.